చందా వివరములు

ఆంధ్రపత్రిక

THE ANDHRA PATRIKA (WEEKLY EDITION) MADRAS సంపుటం 44. సంచిక 89 FOUNDER: DESODHARAKA K. NAGESWARA RAO ఆదివారం 30-6-1957 Reg. No. M. 5745 10 పేజీలు 13 నయాపైసలు



# జులై 1న పటాస్కర్ నివేదిక సమర్పణ

## హొసూరుపై తమిళ హక్కులు భద్రమని మద్రాసు మంత్రి వెల్లడి

మద్రాసు, జూన్ 29: ఆంధ్ర మద్రాసు సరిహద్దు సమస్యలపై శ్రీ పటాస్కర్ తమ నివేదికను జులై 1 వ తేదీలోగా భారత ప్రభుత్వానికి అందజేస్తారని తెలిసింది.

హొసూరుపై తమిళుల హక్కులకు చెరుపు యేమీ రాదని తమకు విశ్వాసం ఉందని ఇవాళ మద్రాసు శాసన సభలో సభానాయకుడు శ్రీ సి. సుబ్రహ్మణ్యం వివరించారు.

ఆంధ్ర మద్రాసు సరిహద్దు సమస్యా పరిష్కారానికి రాష్ట్ర ప్రభుత్వం యే నిర్దిష్టమైన చర్యలు తీసుకున్నదని శ్రీ యన్. కె. పళనిస్వామి వేసిన ప్రశ్నకు సభానాయకుడు సమాధానం చెబుతూ ఉభయ రాష్ట్రాల మధ్య ఏర్పడిన సరిహద్దు తగాదా పరిష్కారం చేయటానికి భారత ప్రభుత్వం నియమించిన శ్రీ హెచ్. వి. పటాస్కర్ గత డిశంబరులో మద్రాసుకు వచ్చినపుడు ఎల్లల సమస్యగురించి మద్రాసు ప్రభుత్వం తమ వాదనలను సమగ్రముగా ఆయనకు నివేదించడం జరిగినదనీ, ఈ విషయమై శ్రీ పటాస్కర్ నివేదికను రాష్ట్ర ప్రభుత్వం నిరీక్షిస్తున్నదనీ అన్నారు.

ఆంధ్ర ప్రాంతానికి చేరువగా కొత్త ఎక్కడో విడిగా ఉన్న ప్రాంతాలపై శ్రీ పటాస్కర్ చెప్పే తీర్పును ఒప్పుకుంటామని ప్రభుత్వం ఎందుకు హామీ యివ్వకలని వచ్చిందని శ్రీ మునుస్వామి గౌండర్ ప్రశ్నించారు.

అందుకు శ్రీ సుబ్రహ్మణ్యం యిట్లా సమాధానం చెప్పారు: "హొసూరు సంగతి దృష్టిలో పెట్టుకునే గౌరవ సభ్యుడు యీ ప్రశ్న అడిగి ఉంటారు. ఆ ప్రాంతంపై తమిళుల హక్కులకు...

యిచ్చాయి.

శ్రీ గోవిందస్వామి: చిత్తూరు జిల్లాలో మనకు యేయే ప్రాంతాలూ రావాలని శ్రీపటాస్కర్‌కు తెలియజేసిన విజ్ఞాపనలో ప్రభుత్వం కోరింది?

సి: తమిళ ప్రాధాన్యంగల ప్రాంతాలను కోరాము.

శ్రీ కె. వినాయకం: మద్రాసు ప్రభుత్వం శ్రీ పటాస్కరుకు అందజేసిన విజ్ఞాపన వివరాలను బయటపెట్టలేదు. మనకు రావలసిన యే యే ప్రాంతాలను గురించి మద్రాసు ప్రభుత్వం నొక్కి చెప్పిందో వివరింపగలరా?

సి: ఆ వివరాలు యిపుడు తెలపడం సాధ్యంకాని విషయం.

"లోక్ సభ సభాపతి వంటివారు కూడా ఆంధ్రుల హక్కుల గురించి తెలపటానికి శ్రీపటాస్కరువద్ద సాక్ష్యంయిచ్చారుగదా. తమిళులు ప్రముఖులవద్దనుంచి ఎందుకు సాక్ష్యాన్ని యిప్పించలేదు" అని శ్రీ వినాయకం ప్రశ్నించగా లోక్ సభ శాసనసభ సభాపతుల విషయమై ప్రశ్నలు వేయకూడదని సభాపతి ఆ ప్రశ్నను నిరాకరించారు.

### రెండవ నౌకా నిర్మాణ కేంద్రం

### నెల్లూరు కోస్తా పరిశీలన

న్యూఢిల్లీ, జూన్ 28: భారత దేశంలో మరొక నౌకానిర్మాణ కేంద్రాన్ని నెలకొల్పటంలో స్థల నిర్ణయం, యంత్రపరికరాలు తదితర అంశాలపై భారత ప్రభుత్వానికి తగు సలహా యిచ్చేందుకుగాను, కొలంబో పథకము క్రింద బ్రిటిష్ నౌకానిర్మాణ సంస్థల సమష్టి అధ్వర్యంలో ఒక రాయబార సంఘం, యిక్కడికి వస్తుంది. వీరు ఆగస్టు, సెప్టెంబర్ మాసాల్లో వస్తారని యివాళ ఒక ప్రకటన జరిగింది.

ఈ కేంద్రానికి ఎంతఖర్చు అయ్యేదీ కూడా వీరు అంచనావేసి చెపుతారు.

ఈ అంశంపై మరియీగా పర్యవేక్షించిన ఒకజట్టు జులై 10 న యిక్కడికి వస్తున్నారు. వీరు యిక్కడ రెండు వారాలపాటు పర్యటిస్తారు. నౌకానిర్మాణ కేంద్ర స్థాపన విషయంలో వీరు కలకత్తా వద్దగల గ్యోంఖాలీ, చిలక సరస్సు సమీపంలోని పరదీప్, సేతు సముద్రం, కొలువు, కొచ్చిన్, కార్వార్, భట్కల్, కాండ్లా, నెల్లూరు కోస్తాలోని కవలేరు ప్రాంతాలను పరిశీలిస్తారు.

### భారతదేశానికి డాలర్ల ఋణం

### అమెరికా సహకార సంస్థ ద్వారా

వాషింగ్టన్, జూన్ 28: భారత దేశానికి, 475 లక్షల డాలర్లు, పాకిస్తాన్‌కు 420 లక్షల డాలర్లు ఋణంగా ఇవ్వ అంతర్జాతీయ సహకార పాలక వర్గం ఒప్పందాలు చేసుకున్నది. మొత్తం 9 దేశాలతో 18 కోట్ల 12½ లక్షల డాలర్ల విలువకు ఋణాలు ఇవ్వడానికి యీ సంస్థ చేసు ఒప్పందాలు చేసుకున్నది.





ఫిన్‌లాండ్ రాజధాని హెల్సింకీలో భారత ప్రధాని శ్రీ నెహ్రూ ఒక అనుపత్రిని సందర్శించారు. అక్కడ పిల్లలు వారికి పూలగుచ్ఛాలు సమర్పిస్తున్నారు.

ఇటీవల జపాన్ ప్రధాని శ్రీ నొబుసుకెకిషి అమెరికా సందర్శించినప్పుడు అధ్యక్షుడు శ్రీ ఐసెన్‌హోవర్‌తో 'గాఫ్' ఆడారు. జపాన్ రాయబారి శ్రీ అసకాయ్, శ్రీ కిషి, శ్రీ ఐసెన్‌హోవర్.

# ఆంధ్రప్రదేశ్‌లో గిడ్డంగి సంస్థల స్థాపన

## డైరెక్టర్ల మండలి ఆమోదం

బొంబాయి, జూన్ 28: ఆంధ్రప్రదేశ్, బొంబాయి, బీహార్, ఒరిస్సా రాష్ట్రాలలో, గిడ్డంగి సంస్థలను స్థాపించే పథకానికి కేంద్ర గిడ్డంగిసంస్థ డైరెక్టర్ల మండలి ఆమోదించింది.

ఈసంస్థ అధ్యక్షుడు, కేంద్ర ఆహార వ్యవసాయశాఖ కార్యదర్శి అయిన శ్రీ పి. యన్. థాపర్ యీ సమావేశానికి అధ్యక్షత వహించారు.

ఈ రాష్ట్ర గిడ్డంగి సంస్థలలో సుమారు రు 20 లక్షలు విలువగల వాటాలను తీసుకునేందుకు కేంద్ర సంస్థనిశ్చయించింది.

మద్రాసు, ఆంధ్ర రాష్ట్రాల్లో కేంద్రసంస్థ గిడ్డంగులను ఏయే కేంద్రాల్లో నెలకొల్పేది కూడా తేలిపోయింది.

ఆచార్య డి. జి. కార్వే, రిజర్వు బ్యాంకుకు డిప్యూటీ గవర్నర్ శ్రీ బుర్రా వెంకటప్పయ్య, సెంట్రల్ బ్యాంకు మేనేజింగ్ డైరెక్టర్ శ్రీ బి. పి. పటేల్ ప్రణాళికా సంఘ సంయుక్త కార్యదర్శి శ్రీ ఎమ్. ఆర్. భిడే, పార్లమెంటు సభ్యులు ...

### పెకింగ్‌లో అల్లర్లు

### మద్రాసుకు ఆంధ్ర ముఖ్యమంత్రి రాక

### విమానాశ్రయంలో ప్రముఖుల స్వాగతం

మద్రాసు, జూన్ 29: ఆంధ్ర ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి సాయంత్రం 4-30కు విమానంలో హైదరాబాదునుంచి వచ్చారు. విమానాశ్రయంలో పలువురు ప్రముఖులు స్వాగతమిచ్చారు. శ్రీ సంజీవరెడ్డి ప్రభుత్వ అతిథిగృహంలో బసచేస్తున్నారు. వారు ఇక్కడ మూడురోజులు ...

### ప్రేలని అమెరికన్ అణుబాంబు

... ఆణుబాంబు ఇవాళ ప్రేలలేదు.

# అణ్వస్త్రాల పోటీ నివారణకు శాస్త్రజ్ఞుల సమావేశం

## మొదటి అణు విచ్ఛేదక నిపుణుని సూచన

లూబెక్ (పశ్చిమజర్మనీ), జూన్ 28: ప్రపంచంలో ఆయుధ నిర్మాణంలో సాగుతున్న పోటీని, ముఖ్యంగా అణ్వస్త్రాల నిర్మాణంలో పోటీని నివారించడానికి, తూర్పు రాజ్యాలకు పాశ్చాత్య రాజ్యాలకూ చెందిన ముఖ్య శాస్త్రజ్ఞులందరూ సమావేశమై చర్చించాలని, యురేనియం అణువును మొట్టమొదటిసారిగా విచ్ఛేదంచేసిన ప్రసిద్ధ పశ్చిమజర్మనీ శాస్త్రజ్ఞుడు ప్రొఫెసర్ ఆటోహాన్ సూచన చేశారు.

పశ్చిమ జర్మనీలోకెల్ల ముఖ్యమైన శాస్త్ర పరిశోధక సంస్థ మాక్స్ ప్లాంక్ సంఘ సమావేశంలో ఉపన్యాస మిస్తూ శ్రీ హాన్ ... శాస్త్ర పరీక్షలు పనికి రావని గట్టిగా చెప్పారు.

ప్రభుత్వాల ప్రమేయం లేకుండా రష్యా అమెరికా యూరప్ లలోని శాస్త్రజ్ఞులందరూ సమావేశమై, ఆయుధ నిర్మాణపు పోటీని, ముఖ్యంగా అణ్వస్త్ర నిర్మాణపు పోటీని క్రమేణా ఎలా అదుపులోకి తీసుకురావాలో చర్చించాలన్నారు.

### కుటుంబ నియంత్రణ ఉద్యోగులు

### ఖర్చు కేంద్రంభరించినా రాష్ట్రాలలో జాప్యం

న్యూఢిల్లీ, జూన్ 29: రాష్ట్రాలలో నియమించే కుటుంబనియంత్రణోద్యోగుల ఖర్చును పూర్తిగా కేంద్రమే భరిస్తున్నా, ఈ ఉద్యోగుల నియామకంలో రాష్ట్రప్రభుత్వాలు జాప్యంచేస్తున్నాయని ఆరోగ్యమంత్రుల సమావేశంలో కేంద్ర ఆరోగ్యశాఖ మంత్రి శ్రీ కర్మార్కర్ విమర్శించారు.

ద్వితీయ ప్రణాళికలోని ప్రజారోగ్య కార్యక్రమాలను వివరిస్తూ, కుటుంబ నియంత్రణ చాలాముఖ్యమైన విషయమన్నారు. ఈ కార్యక్రమాలు శీఘ్రంగా అమలుపరచేందుకు కేంద్రంలో ఒక మంత్రి మండలిని యేర్పాటు చేశారు. ఈ కార్యక్రమాలను అమలుపరచవలసిన అవసరాన్ని ప్రజలు చాలవరకు అర్థంచేసికొన్నారు. ప్రజలకు సాంకేతిక సలహాలను ఇవ్వవలసి ఉంది. అందువల్ల రాష్ట్రాలు శీఘ్రంగా తగుచర్యలు తీసికోవాలి అన్నారు.

# శీతజ్వరానికి జులైలో మందు తయారీ

## ఖరీదు ఎక్కువ అని కర్మార్కర్ ప్రకటన

న్యూఢిల్లీ, జూన్ 29: ప్రస్తుత శీతజ్వరవ్యాధి క్రిమి నిరోధానికి టీకాలమందు జులైనెల మధ్య నాటికి తయారు కాగలదనీ, ఐతే ఇందుకు ఖర్చుకూడా అధికంగానే ఔతుందనీ రాష్ట్ర ఆరోగ్య మంత్రుల సమావేశంలో మాట్లాడుతూ కేంద్ర ఆరోగ్య శాఖామంత్రి శ్రీ డి. పి. కర్మార్కర్ తెలిపారు.

ఇతర దేశాలనుండి ఈ మందు సరఫరా అవకాశాలు ప్రోత్సాహకరంగా లేవన్నారు. కూనూరులోని భారత ప్రభుత్వ శీతజ్వర పరిశోధక కేంద్రంలో ఈ టీకాలమందును తయారుచేస్తున్నారు. బొంబాయిలోని హాఫ్కిన్ సంస్థలోను, కసౌలీలోని కేంద్ర పరిశోధనాలయంలోను ఈ మందు తయారుచేసే అవకాశాలను గురించి పరిశోధనలు జరిపారు.

ద్వితీయ ప్రణాళికలోని ఆరోగ్య కార్యక్రమాన్ని చర్చించేందుకు ఏర్పాటుచేసిన రాష్ట్ర ఆరోగ్య మంత్రుల సమావేశంలో మాట్లాడుతూ శ్రీ కర్మార్కర్ ఇలా చెప్పారు. "దేశంలోని వివిధ భాగాల నుండి అందిన నివేదికలవల్ల ఇంతవరకు నాలుగున్నర లక్షల మందికి శీతజ్వరం సోకింది. మొత్తం 819 మంది మరణించారు. మద్రాసు, ఢిల్లీ, కలకత్తా, బొంబాయివంటి పెద్దనగరాలలో ఈవ్యాధి తగ్గుముఖంపట్టినా, ఇతర నగరాలలోను, చిన్న చిన్న గ్రామాలలోను ఇంకా ప్రబలంగా ఉంది. ఈవ్యాధివ్యాప్తి కాకుండా ఆరోగ్యశాఖ తగుచర్యలు తీసికుంటుంది. ఇందుకు ప్రజలుకూడా తోడ్పడాలి."

వ్యాధి వ్యాప్తి కాకుండా రాష్ట్ర ప్రభుత్వాలు తీసికొన్న జాగ్రత్త చర్యలను, ఈవిషయంలో చేకూరిన ప్రజల తోడ్పాటును ఆయన అభినందించారు.

### చిన్న విమానాల కొనుగోలు వాయిదా

### భారత ప్రభుత్వ నిర్ణయం

న్యూఢిల్లీ, జూన్ 29: ఢిల్లీనుంచి సమాజ అభివృద్ధి కేంద్రాలతో బాటు, దేశంలోగల వివిధ అభివృద్ధి కేంద్రాల మధ్య త్వరితంగా ప్రయాణాలు కొనసాగేందుకుగాను, యిదివరలో తెప్పించాలనుకున్న రెండు ప్రత్యేకమైన చిన్న విమానాల కొనుగోలును వాయిదా వేయాలని, ఉక్కు, గనులు, ఇంధనాలశాఖ నిర్ణయించింది. ఇప్పుడు కటకటగాఉన్న విదేశీ ద్రవ్యాన్ని పొదుపు చేసే ఉద్దేశ్యంతో ప్రభుత్వం యీ చర్య తీసుకున్నది. ఈశాఖ చేసేఖర్చులను కార్యదర్శి స్వయంగా పర్యవేక్షిస్తూ, వీలైనంత వరకు పొదుపుజరిగేటట్లు చూడాలని మంత్రి సర్దార్ స్వరణ్‌సింగ్ కోరారు.

### కాశ్మీర్‌పై బ్రిటన్ పాక్ చర్చలు

### మాక్మిలన్ ప్రోద్బలం

లండన్, జూన్ 28: భారత పాకిస్తాన్ దేశాలమధ్యగల కాశ్మీర్, కాలవ నీటి తగాదాలపై బ్రిటిష్, పాకిస్తాన్ ప్రధానమంత్రులు అంతరంగిక సమావేశంలో చర్చించారు. ఈ సమావేశాన్ని బ్రిటిష్ ప్రధాని మాక్మిలన్ ఏర్పాటు చేశారు.

ఈ సంప్రదింపులు డౌనింగ్ స్ట్రీట్‌లోని మాక్మిలన్ గృహంలో జరిగాయి. ఈ సమావేశం బ్రిటిష్ ప్రధాని కోరికపై జరిగిందని అధికారవర్గాలద్వారా తెలిసింది. బ్రిటన్ తరఫున మాక్మిలన్‌తోపాటు విదేశాంగమంత్రి శ్రీ లాయిడ్, కామన్వెల్త్ వ్యవహారాలశాఖా మంత్రి హోంపాల్గొన్నారు. పాకిస్తాన్ ప్రధాని సురావర్దీతో వెంట ఆర్థిక విదేశాంగ మంత్రి నూన్, బ్రిటన్‌లోని పాకిస్తాన్ హైకమీషనరు మహమ్మద్ ఇక్రముల్లా వచ్చారు.

ఈ సమావేశంలో బ్రిటన్ పాకిస్తాన్ దేశాల ప్రతినిధులు మాత్రమే పాల్గొన్నారు. శ్రీ కామన్వెల్త్ సమావేశంలో పాల్గొంటున్న మరో దేశప్రతినిధి ఎవ్వరూ పాల్గొనలేదు.

### ప్లానింగ్ కమీషన్ త్రివేదీ నియామకం

హైదరాబాదు, జూన్ 29: ప్లానింగ్ కమీషన్ ఉపాధ్యక్షుడు శ్రీ వి. టి. కృష్ణమాచారి పదవి విరమణ చేయనున్నారు. జులై 30 నాడు ఆంధ్ర గవర్నరు. పదవినుంచి విరమించనున్న శ్రీ త్రివేదీని, శ్రీ కృష్ణమాచారి స్థానంలో నియమిస్తారు.

# అఖిలభారత ప్రాథమిక విద్యామండలి స్థాపన

## జులై 1 నుంచీ పని ప్రారంభం

న్యూఢిల్లీ, జూన్ 29: కేంద్ర ప్రభుత్వానికి, రాష్ట్రప్రభుత్వాలకు, స్థానిక సంస్థలకు ప్రాథమిక విద్య విషయంలో సలహా మండలిగా వ్యవహరించడానికి జులై 1 నుంచి, అఖిల భారత ప్రాథమిక విద్యామండలి నెలకొల్పుతున్నట్లు భారత ప్రభుత్వం ప్రకటించింది.

దేశంలో ప్రాథమిక విద్యను మరింత శీఘ్రగతిలో వ్యాపింపచేసి, రాజ్యాంగం లోని 45 వ నిబంధన అదేశాన్ని అమలు జరపడానికి దీనిని నెలకొల్పుతున్నట్లు ప్రభుత్వం గెజెట్‌లో ప్రకటించింది.

పద్నాలుగేళ్ల వరకూ బాలబాలికలందరికీ దేశమంతటా నిర్బంధంగా ప్రాథమిక విద్యాబోధన 1960 లోగా ఏర్పాటు చేయ్యాలని రాజ్యాంగం ఆదేశాల ప్రకరణంలో 45 వ నిబంధన ప్రభుత్వాలపై బాధ్యత వేసింది.

### హైద్రాబాదులో ఒక్కరోజులో 1600 మందికి

హైదరాబాదు, జూన్ 28: నగరంలో నేడు శీతజ్వరం 1600 మందికి సోకింది. ఇంత ఉధృతంగా ఇంతవరకు రాలేదు. నిన్న 1200 మందికి, మొన్న 1000 మందికి సోకింది. అయితే ఇంతవరకు ఎవరూ యీ వ్యాధిమూలంగా చనిపోలేదు. పురపాలకసంఘం ఆరోగ్య సిబ్బందిని అధికంచేసింది.

ఖమ్మం, పరిసరాలలోను మొత్తం 800 మందికి ఈ వ్యాధిసోకింది. విద్యాసంస్థలు జులై 8 వరకు మూసివేశారు.

### జులై 16న రాష్ట్రపతి హైద్రాబాదుకు రాక

### 24 రోజులు మకాము

హైద్రాబాద్, జూన్ 29: రాష్ట్రపతి డాక్టర్ రాజేంద్ర ప్రసాద్ జులై 16 న యిక్కడికి వస్తున్నారు. వీరు యిక్కడ 24 రోజులు ఉంటారు.

ఆంధ్ర ప్రదేశ్ ఏర్పడిన పిమ్మట రాష్ట్రపతి యిక్కడికి రావటం యిదే ప్రథమం.

ఇక్కడికి 10 మైళ్ళదూరంలో ఉన్న "రాష్ట్రపతి నిలయంలో వీరు మకాము చేస్తారు. ఆగస్టు 9 న వీరు కేంద్రం వెళ్తారు.

## టెండరు నోటీసు
### నాగార్జునసాగర్ డామ్

ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు, (మెటీరియల్స్ డివిజన్) డివిజన్, విజయపురి (నార్తు) పోస్టు, నల్లగొండ జిల్లా వారిచే క్రింద వివరించిన పనులకు 8-7-1957 సా॥ 4 గంటల వరకు సీలువేసిన టెండర్లు డామ్ సైట్ ఎడమగట్టు, వందలి తమ ఆఫీసు నందు దాఖలు చేసికొనబడి, అదేదినం సా॥ 4-15 గం॥లకు తెరిచి పరిశీలింపబడును. టెండరు డాక్యుమెంట్లు 1-7-1957 తేదీనుండి 6-7-57 వరకు ఆఫీసు పనిచేయు గంటలలో ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్, మెటీరియల్స్ డివిజన్ ...

## వెనుకబడిన తరగతులు
### అభ్యున్నతికి కాంగ్రెసుకు అనుబంధంగా సంస్థ

విద్యుల్లోలు, జూన్ 26: వెనుకబడిన జాతుల సర్వతోముఖాభివృద్ధికై సుసంఘటితమైనసంస్థను ఒకదానిని ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసుకు అనుబంధంగా ఏర్పాటుచేసేందుకు త్వరలో ఒకమహాసభను జరిపించాలనికోరుతూ అనంతపురంలో మేలో ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ కార్యవర్గం ఒక ఉపసంఘాన్ని నియమించింది. ఆమహాసభను సాధ్యమైనంతవరకూ జూలైఆఖరులోగా హైదరాబాదులో జరిపించాలని అనుకొంటున్నారు. అక్కడక్కడ వెనుకబడినజాతుల సముద్ధరణకు కృషిచేస్తున్న ఆయాసంస్థలు తమతమ ప్రతినిధుల పేర్లనుముందుగా తెలియజేస్తూ అవసరమైన సూచనలనుకూడా జూలై 8 నుండి నెలాఖరువరకూ ఆంధ్రప్రదేశ్ శాసనసభ హైదరాబాదు చిరునామాకు అందజేయవలసినదిగా ఆంధ్రకాంగ్రెసు సహాయకార్యదర్శి శ్రీ ప్రగడకోటయ్య కోరుతున్నారు.

## ప్రధానాధ్యాపకుని రాజీనామా

బందరు, జూన్ 28: బందరు నేషనల్ కాలేజి ప్రధానాధ్యాపకుడు శ్రీ వరదాచారి తన ఉద్యోగానికి రాజీనామా ఇచ్చారు. రాజీనామాను కళాశాల పాలకవర్గం ఆమోదించింది.

## ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము

1951 మద్రాసు హిందూమత ధర్మాదాయ సంస్థల చట్టము క్రింద ప్రకటన

## కీ॥ శే॥ వెంకటాచలపతి

గుంటూరు, జూన్ 28: శ్రీ నేతి వెంకటాచలపతి మృతికి సంతాపం తెలియచేస్తూ లోక్‌సభ సభాపతి శ్రీ అనంతశయనం అయ్యంగార్, ఉత్తరప్రదేశ్ గవర్నరు శ్రీ వి. వి. గిరి, సుప్రీంకోర్టు న్యాయమూర్తి శ్రీ బి. జగన్నాథదాస్, భారత ఉపరాష్ట్రపతి డాక్టరు రాధాకృష్ణన్ మొదలయిన ప్రముఖులు వెంకటచలపతిగారి కుమారుడు శ్రీ నేతి వెంకటేశ్వర్లుకు సందేశాలను పంపించారు.

కేంద్ర ఉపమంత్రి శ్రీ కొత్త రఘురామయ్య వెంకటచలపతిగారి కుమారులను కలుసుకుని తమ సానుభూతిని తెలియచేశారు.

## ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము

1951 మద్రాసు హిందూమత ధర్మాదాయ సంస్థల చట్టంక్రింద ప్రకటన

G. O. Ms. No. 607/8-6-57.

క్రింది షెడ్యూలులో స్పష్టీకరించిన ప్రకారం కడపజిల్లా, కడప తాలూకా, పుష్పగిరి గ్రామంలోని "శ్రీ పుష్పగిరి బ్రాహ్మణ అన్నదాన సత్రం." అని పిలువబడే ధర్మాదాయసంస్థ పరిపాలన యీ క్రింది షెడ్యూలులో వివరించిన ప్రకారం సక్రమంగా లేదని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి విన్నపాలు వచ్చినందునను;

సదరు ధర్మాదాయ సంస్థ సక్రమముగా పరిపాలింపబడుట లేదని ప్రభుత్వము వారు నమ్ముటకు తగిన కారణము లున్నందునను;

సదరు ధర్మాదాయసంస్థ పరిపాలనా ...

## ప॥ గోదావరి జిల్లాలో రైతులకు సౌకర్యాలు
### రెవెన్యూ మంత్రికి విజ్ఞప్తి

ఏలూరు, జూన్ 25: రాజకీయ బాధితులకు భూములిచ్చే సమస్యవిషయంలో యిక్కడకు వచ్చిన ఆంధ్రప్రదేశ్ రెవెన్యూ మంత్రి శ్రీ కళా వెంకట్రావు గారికి పశ్చిమ గోదావరి జిల్లా మార్కెటింగ్ ఫెడరేషన్ అధ్యక్షులు శ్రీ కొమ్మారెడ్డి సూర్యనారాయణ ఫెడరేషన్ కార్యాలయంలో విందు చేశారు. పలువురు అధికార, అధికారేతర ప్రముఖులు వచ్చారు.

అనంతరం శ్రీ సూర్యనారాయణ మంత్రికి ఫెడరేషన్ తరఫున విజ్ఞప్తి సమర్పించారు. ఫెడరేషన్ గత సంవత్సరం 54 లక్షల విక్రయాలుచేసే ఎరువులు కొని రైతులకు అమ్మినదనీ, రైతుల ధాన్యాలకు సరియైన ధర రాబట్టాలంటే ఫెడరేషన్‌కు ఒక బియ్యపుమిల్లు, గిడ్డంగులూ అవసరమనీ వివరించారు. వాటిని నిర్మించేందుకు సహాయం ఇప్పించవలసినదిగా మంత్రిని కోరారు. (స్వ. వి.)

## రేపల్లె పురపాలక సంఘం
### ప్రత్యేకోద్యోగికి మరో 3 నెలలు గడువు

హైదరాబాదు, జూన్ 28: రేపల్లె పురపాలక వ్యవహారాలు చూస్తున్న ...

## ఆవిరి ఇంధనంగా వంటలు
### మదరాసులో ప్రయోగం

మదరాసు, జూన్ 28: పండుగలు, ఉత్సవాలలో 50 వేలమందికి పైగా పెద్దపెద్ద సంతర్పణలు జరపవలసి వచ్చినప్పుడు మదరాసు రాష్ట్రంలో ఆవిరితో వంటలు చేస్తున్నారు. దీనిని ఒక విశేషంగా బాయిలర్ల చట్టం అమలును గూర్చిన నివేదికలో మదరాసు ప్రభుత్వపు స్టీంబాయిలర్ల ప్రధాన ఇన్‌స్పెక్టరు ఉదహరించారు.

మధుర కంపెనీ లిమిటెడ్ వెంకులను అరపెట్టడానికి ఉష్ణోదక పీడనం ద్వారా వేడిచేసే విధానాన్ని అనుసరిస్తున్నారు. విదేశాలలో అమల్లో వున్న ఈ విధానాన్ని ఇక్కడ అమలు జరపట ఇదే ప్రథమం.

## నగరంలో సంజీవరెడ్డి కార్యక్రమం

మదరాసు, జూన్ 29: నగరంలో ఆంధ్రప్రదేశ్ ముఖ్య మంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి కార్యక్రమం శ్రీ వై. రామకృష్ణప్రసాద్, వారి గౌరవార్థం హోటల్ ఓషియానిక్‌వద్ద ఇస్తున్న అల్పాహార విందులో ప్రారంభమౌతుంది.

జూన్ 30 న ఉదయం "మన లిపి పుట్టుపూర్వోత్తరాలు" అని శ్రీ టి. రామచంద్ర వ్రాసిన గ్రంథం అంకితం ఇచ్చే సభలో మాట్లాడతారు. 8-30 లకు ...

## బియ్యం రవాణాపై నిర్బంధాలు
### మిల్లు యజమానుల వ్యతిరేకత

బందరు, జూన్ 25: ఆంధ్ర, మద్రాసు, మైసూరులను కలిపి దక్షిణ మండలంగా ఏర్పాటుచేసి బియ్యం రవాణా స్వేచ్ఛను పరిమితంచేసినందుకు అసమ్మతి తెలియబరుస్తూ బీహారు, అస్సాం, బెంగాల్‌లలో ఎంతోగిరాకీ వున్న మేలురకపు ఆంధ్ర బియ్యానికి యీ నిర్బంధం వర్తింపజేయరాదని, దీనివలన రైతులు వ్యాపారస్థులు చాలా నష్టపడగలరని ప్రభుత్వానికి ఆంధ్రప్రదేశ్ బియ్యపుమిల్లుల యజమానుల సంఘం యీ నెల 22 న భీమవరంలో జరిగిన సమావేశంలో విజ్ఞప్తి చేసింది.

తవుడు రవాణా పర్మిట్లను ఆమశ్యనూయజ్ సమస్య మూలంగా అమలు జరుపలేకపోయి నందున, కాలపరిమితిని పొడిగించాలని ఎగుమతులను జాయింటు కంట్రోలరును కోరారు. వ్యాగన్లు ఎక్కువగా సరఫరాచేసి నిల్వబియ్యం ఇతర రాష్ట్రాలకు త్వరగా రవాణాఅయ్యేందుకు వీలు కలిగించాలని విజ్ఞప్తిచేశారు. పరపతి సౌకర్యాలపై రిజర్వుబ్యాంకు విధించిన నిర్బంధాలను తొలగించి మిల్లుల యజమానులకు సహాయంచేయాలని సూచించారు.

బియ్యపుమిల్లుల యజమానుల సంఘానికి ప్రారంభోత్సవం జరిగేసందర్భంలో ...

## ఉప్పుడు బియ్యానికి గిరాకీ
### భీమవరంలో ధాన్యం బియ్యం ధరవరలు

... సరుకు రవాణా రైలు పెట్టెలు సప్లయి కాలేదు; పశ్చిమబెంగాలుకు మాత్రమే వాగన్లను ఇచ్చారు. బెంగుళూరులో గిరాకీ వున్నందున మేలిరకం ధాన్యానికి మిల్లు యజమానులు ఎక్కువ ధర ఇవ్వ చూపుతున్నారు. ఇప్పుడు ఇక్కడ ధాన్యం, బియ్యం ధరవరల వివరాలివి:

| | ధాన్యం 166 పౌ.బ. | బియ్యం 164 పౌ.బ. |
|---|---|---|
| కిచిలీ సంబాలు | రు. 29 | రు. 49 |
| సన్నకృష్ణకాటుకలు | 28 | రు. 47 |
| కృష్ణకాటుకలు | రు. 28 | రు. 45 |
| అక్కుళ్లు | రు. 28 | రు. 42.50 |
| గరికలు | రు. 27 | రు. 89.50 |
| వంకసన్నాలు | రు. 27 | రు. 48.50 |

## మదరాసు ధరలు

మదరాసు, జూన్ 29:

బంగారు వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు సవరను 1-కి ఎడ్వర్డుబొమ్మ

| | | |
|---|---|---|
| సేల్సుటాక్సుతో సహా | రు. | 70.75 |
| పేట్లా బంగారం తులం | రు. | 107.87 |
| మూసా బంగారం తులం | రు. | 106.25 |
| సీమవెండి తులం 100కి | రేడి | 183.50 |
| చిల్లర ధర | రు. | 1.93 |

### వేరుశనగ

(551 పా॥ 1-కి ఎక్సు గోస్తా గిడ్డంగులు మెషిన్ సేల్సుటాక్సుతో సహా

| | | |
|---|---|---|
| డిసెంబరు | రు. | 166-170 |
| వేరుశనగనూనె ఎక్సుపెల్లర్ టిలో % పా.) రెడి చిల్లర ధర | | 884 |

50 టెంకాయనూనె (87½ పౌనులు సేల్సుటాక్సు అదనం,

| | | |
|---|---|---|
| అంబుమార్కు | రు. | 80.00 |
| ఎం. ఎస్. బ్రాండ్ డబ్బా | | 81.00 |
| రాజా | రు. | 80.25 |

### ఆముదం

తిరుపత్తూరు (500 పా.) రు. 850.00

### పంచదార

సేలం లోటస్ ర్యాన్ (87½ పా) 28.00

## న్యూయార్కు దూది
### అక్టోబరు వాయిదా ధరలు

న్యూయార్కు, జూన్ 28: న్యూయార్కు, కాటన్ మార్కెట్ ధరలు నేడీ విధంగా ఉన్నవి:

| | |
|---|---|
| నేటి ప్రారంభ ధర | 85.22 |
| నేటి ముగింపు ధర | 85.28 |

## తూర్పుగోదావరి జిల్లా కొబ్బరికాయ మార్కెటు

(ఈ నెల 22 తేదీతో సమాప్తమైన వారంలో వ్యాపారము)

రాజమండ్రి, జూన్ 27:

వెయ్యి 1 కి ధర రూ॥లలో

| కేంద్రము | చేరినసరుకు | ఎగుమతైనసరుకు | గండేర | గటాగట | చిట్టికాయ | నీటికాయ |
|---|---|---|---|---|---|---|
| అమలాపురం | 833238 | 8332?8 | 195/- | 188/- | 170/- | 110/- |
| అంబాజీపేట | 77520 | 77520 | | | | |
| రాజమండ్రి | 215000 | 288000 | — | — | — | — |
| కాకినాడ | 427161 | 427161 | — | — | — | 130/- |

500 పోస్ల ప్రట్టి 1 కి రు 262.20 లు చొప్పున 28600 పోస్లు అంబాజీపేటలోనూ 9440 పోస్లు రాజమండ్రిలోనూ, ఎండుకొబ్బరి ఎగుమతిఅయినట్లు తూర్పుగోదావరిజిల్లా మార్కెటు కమిటీ కార్యాలయంద్వారా తెలుస్తున్నది. (స్వ. వి.)

## ఆఫ్రికాకు కొలంబోపథకం
### ఘనాప్రధాని సూచన

లండన్, జూన్ 29: ఆఫ్రికాకు ఒక "కొలంబో పథకాన్ని" రూపొందించాలని కామన్వెల్తు ప్రధాన మంత్రుల సమావేశంలో ఘనాప్రధాని క్వామే న్క్రుమా సూచించారు.

అంతర్జాతీయ రంగంలో రాజకీయ వైషమ్యాలకు ఆఫ్రికా స్థావరం కాకుండా ఉండేందుకుగాను, ఈఖండంలోని ఆర్థిక, నిపుణ సహాయాలన్నిటినీ సమన్వయంచేసే పథకాన్ని రూపొందించాలని ఆయన తెలిపారు.

ఈసూచనకు కెనడా ప్రధాని డైఫెన్ బేకర్ ఆమోదించారు. 1951 లో ఆగ్నేయాసియా దేశాలకు ఏర్పాటు చేసిన కొలంబోపథకంవంటి ఒకపథకాన్ని ఆఫ్రికాదేశాలకు సంబంధించి అమలుచేయవలసిన అవసరంఉందని ఘనాప్రధానితో జరిపిన సంప్రదింపుల వల్ల స్పష్టమైందని పత్రికాప్రతినిధులతో నిన్న మాట్లాడుతూ కెనడా ప్రధాని తెలిపారు.

ఈ పథకం ప్రకారం ఆఫ్రికాలోని స్వాతంత్ర్యం పొందిన దేశాలు, బ్రిటన్, ఫ్రాన్సు, పోర్చుగల్ అధీనంలోని ఇతర ప్రాంతాలు ఈ మూడు దేశాలతోను, సహాయం చేయడానికి అంగీకరించే ఇతర దేశాలతోను సంబంధం కలిగివుంటాయి. ప్రస్తుతం ఆఫ్రికా రాజ్యాలకు సహాయం చేసేందుకు అమెరికా, కెనడాలు తమ సంసిద్ధతను తెలిపాయి.

ఆఫ్రికారాజ్యాల కన్నిటికీ ఆసక్తిగల సమస్త విషయాలపైనా, ఆ రాజ్యాలతో సహకరించేందుకు తాము సిద్ధంగా ఉన్నామని దక్షిణాఫ్రికా విదేశాంగమంత్రి శ్రీ లౌ దక్షిణాఫ్రికా క్లబ్ ఏర్పాటుచేసిన విందులో మాట్లాడుతూ అన్నారు. గత రెండు సంవత్సరాలుగా అంతర్జాతీయ వ్యవహారాలలో ఆఫ్రికా కేంద్రస్థానం పొందింది. ఈ ఖండంలో అనేక మార్పులు జరుగుతున్నాయి. అందులో ఒకటి కామన్వెల్తు ప్రధానుల సమావేశంలో ఘనా ప్రధాని పాల్గొనడం అన్నారు.

దక్షిణాఫ్రికా ప్రధాని తరఫున కామన్వెల్తు దేశాల సమావేశంలో పాల్గొనేందుకు శ్రీ లౌ ఇక్కడకు వచ్చారు. ఘనా ప్రధాని సరసను కూర్చోవలసి వస్తుందనే కారణంతో దక్షిణాఫ్రికా ప్రధాని ఈ సమావేశానికి రాలేదన్న విషయం పాఠకులకు తెలిసిందే.

## ప్రకటన

### ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము - నేషనల్ ఎక్సుటెన్షన్ సర్వీసు క్రింద రాష్ట్రములో బ్లాకులకు విలేజి లెవల్ వర్కర్ల నియామకమునకు దరఖాస్తులు.

| జిల్లాలు | ఇంటర్వ్యూ చేయబడు తేదీ | ఇంటర్వ్యూచేయు స్థలము |
|---|---|---|
| శ్రీకాకుళం, విశాఖపట్నం | 19-7-57 | ఎక్స్టెన్షన్ ట్రెయినింగ్ సెంటరు, సామర్లకోట. |
| తూర్పు గోదావరి | 20-7-57 | ,, |
| పశ్చిమ గోదావరి | 21-7-57 | ,, |
| కర్నూలు, కడప, అనంతపూరు | 27-7-57 | కర్నూలు కలెక్టరు ఆఫీసు |
| గుంటూరు | 2-8-57; 3-8-57 | గుంటూరు కలెక్టరు ఆఫీసు. |
| కృష్ణ | 4-8-57 | ,, |

ఇంటర్వ్యూకు వచ్చు అభ్యర్థులకు రాకపోకల ప్రయాణపు ఖర్చులు యివ్వబడవు. ఇంటర్వ్యూలకు ప్రత్యేకముగా ఆహ్వానములు పంపబడవు.

**షరతులు; నిబంధనలు:**

ఎన్నుకొనబడిన అభ్యర్థులు, విజయవంతముగా తమ ట్రెయినింగు పూర్తి చేసిన తరువాత, విలేజి లెవల్ వర్కర్లుగా నియమింపబడునప్పుడు రు. 45-3-60 2-100 జీతపు స్కేలులోను, మామూలు అలవెన్సులలోను నియమింపబడుదురు. తమ పనులను సామర్థ్యముతో చేయగలవారు రు. 100-5-120 స్కేలు జీతముగల సెలెక్షన్ గ్రేడ్‌నకు ప్రమోషన్ పొందు అవకాశము గలదు.

ట్రెయినింగు కోర్సునకు ప్రవేశము పొందినవారికి నెలకు రు. 30/- వంతున ప్రాథమిక వ్యవసాయ శిక్షణ కాలములోను, రు. 50/- వంతున ఎక్స్టెన్షన్ మెథడ్సులో శిక్షణ పొందునప్పుడు, ఉచిత వేతనము యివ్వబడును.

ట్రెయినింగులో చేర్చుకొనబడిన తరువాత ప్రాథమిక వ్యవసాయములో శిక్షణ పొందునప్పుడు, అభ్యర్థులు తగిన అభివృద్ధి చూపక యీ పనులకు తగనివారుగా కనుబడినచో, అట్టివారు తీసివేయబడుదురు.

ఎన్నుకొనిన అభ్యర్థులు ఉద్యోగములో నియమింపబడిన తరువాత విలేజి లెవల్ వర్కర్లుగా కనీసము నాలుగు సం॥లు పనిచేయవలెను.

...

సి. నరసింహం,

అడిషనల్ డెవలప్‌మెంటు కమీషనరు అండ్ సెక్రటరీ, ఆంధ్ర ప్రభుత్వము హైదరాబాదు.

# తిమింగిలాల వేట: వలల్లో పడీపడీ అలల్లో లేకుండా పోతాయా?

మహా సముద్రాల్లో తిమింగలం విలాసంగా తేలియాడుతుంటుందనీ, అది ఏ కొండ శిఖరమో, ఏ ఇసుక తిన్నో అనుకుని ఓడలవాళ్లు అక్కడ ఆగగానే అది చల్లగా దాని పని అది చేసుకుంటుందని పాశ్చాత్య పురాణాల్లో అక్కడక్కడా కానవస్తుంది. దానికి మనిషి గుణాలు కూడా ఉన్నాయేమో!

అలాటి తిమింగలాల వేట ఎంత ఘనమైనదో! ప్రస్తుతం ప్రపంచంలో బతికి ఉన్న ప్రాణులలో కల్లా తిమింగలం పెద్దది; ఎక్కడైనా కొన్ని చోట్లు అంతకంటే పెద్దవి ఉండవచ్చు. దాన్ని వేటాడడానికి చాలా పెద్ద ప్రాంతంలో తిరగాలి. పెద్ద సన్నాహం. ప్రమాదమే సంభవిస్తే, ఓడలూ, నిపుణులైన వేట దారులు, బ్రహ్మాండమైన సరంజామా, అన్నీ సముద్రం పాలే.

## నాజూకు పెదవులకు

దక్షిణ ధృవతీరపు సముద్రంలో, అంత చలిలో, ఇంత పెద్ద సరంజామాతో ఇంతచిన్న మనుష్యులు అంత మహా భయంకర జలచరాల్తో తలపడడం వింత సాహసమే.

సాహసప్రియత్వం మాట అలా ఉంచి, ఒక్కొక్క తిమింగలం నుంచి లభించగల పదార్థాలు ఎన్నో ఉన్నాయి—కొవ్వు, నూనె, కొన్ని ప్రత్యేక ఆహార ద్రవ్యాలు, ఎరువులు, యంత్రాల్లో ఘర్షణ తగ్గించే పదార్థాలు—అన్నింటికంటే ముఖ్యమైన పదార్థం, 'పెదవిపూత' తయారుచేయడానికి మేలురకపు ముడిసరుకు.

## ఇరుకు పీక

తిమింగలాలు చేపలు కావు; పిల్లలకు పాలిస్తాయి కూడాను. ఇక నీలి తిమింగలాలు గమ్మగాయి పెళ్లాంలాటివి—వాటికి ఎదురులేదు. అవి సముద్రపు రాజులు, రాణులు. నీలి తిమింగలం బరువు నూరు టన్నులకు పైమాట. (పెద్ద ఏనుగు ఐదుటన్నుల దాదాపులో ఉంటుంది.) మరి, ఇంత పెద్ద జంతువులు భూమిమీద ఎలా తిరుగుతాయి?—భూమిమీద తిరగాలంటే, అట్లాంటి జంతువులకు ఎంత పెద్ద కాళ్లు ఉండాలి! కాళ్ళులేవు కాబట్టే నీళ్లలోనే ఉంటాయి. తిమింగలం నోరు ఎంత పెద్దదంటే, దాని నోట్లో ఒక కారును పెట్టుకోవచ్చు. కానీ దాని పీక చాలా ఇరుకైనది—మంచి బలిష్ఠుడైన మనిషి ముంజేయి పట్టే పాటిది!

పళ్లు కోరలులేని తిమింగలాలు చిన్న చిన్న జలజంతువులను తింటాయి. నోటనీటిని నింపుకుని, ఆ నీటిని ముక్కు నుంచి చిమ్మిన గ్రోవిలోంచి కొట్టి అటు పైకి కొట్టాయి; చిన్న జంతువులు నోట్లో ఉండిపోతాయి. దవడ ఎముకతో ఆ చిన్ని జంతువులను నొక్కివేసి మింగేస్తాయి.

పళ్ళు ఉన్న తిమింగలాలు చాలా లోతులకు వెళ్లి మంచి చేపలను వేటాడి తింటాయి. ఈ పళ్ల తిమింగలాల వేట లాభసాటిది.

## పూర్వం - ప్రస్తుతం

పూర్వం పెద్ద పెద్ద పడవల్లో వెళ్ళి తిమింగలాలను వేటాడేవారు. ప్రమాదాలకు లోనయ్యేవారు. తిమింగలానికి కొన్ని గజాల సమీపంలోకి వెళ్ళి ఒక పెద్ద బాకాన్ని దానికి గుచ్చుకొనేటట్లు విసిరి కొట్టేవారు. ఆ బాకం దాని ఆయువుపట్టుల్లో దిగితే సరే—లేకపోతే అది నానా భీభత్సం చేసేది. ఒక్కదెబ్బలో పడవ ముక్కలై అంతా నీటి పాలయ్యేవారు. తిమింగలం చనిపోయేదాకా బాకం తీగను కత్తిరించడానికి వీలులేదు! గ్రీన్‌లాండ్ ప్రాంతంలో, అంత చలికదా, రక్తం గడ్డకట్టుకుపోయే చలి, అయినా వేటగాళ్లు ఆ బాకం తీగతోపాటు నీటిలోనైనా దుముకేవారు గానీ, ఎంత భీభత్సం జరిగినా బాకం తీగను కత్తిరించే వారు కారట. ఒక్కొక్కప్పుడు తిమింగలం పడవను ఈడ్చుకుపోయేది. అయినాసరే ఆ ఆర్భాట వేటగాళ్లకు చాలా ఆహ్లాదకరం!

ఇప్పుడు పద్ధతులు మారిపోయినాయి. నవీన విజ్ఞాన సహాయంతో, తిమింగలాన్ని మించిన భీభత్సం చేయగలరు. ఒక తుపాకీనుంచి బాకాన్ని వేసి తిమింగలం శరీరంలోకి పేల్చుతారు. విద్యుత్ ప్రభావం కలిగిన బాకాలను కూడా పేల్చుతున్నారు. ఒక డజను చిన్న ఓడలు ఈ తుపాకుల్తో బయలుదేరుతాయి. ఒకటి రెండు ఓడలు, చచ్చిన తిమింగలాలను ఈడ్చుకొస్తాయి. పైగా అందులో ఒక ఓడలో తిమింగలాన్ని వేరు వేరు ముడి పదార్థాల కిందకు వరికి ముక్కలు పెట్టే యంత్రాలూ వగయిరా సరంజామా అంతా ఉంటుంది. ఇలా బయలుదేరే ఒక్కొక్క వేట జట్టుకు ఇరవై లక్షల ఖర్చు అవుతుంది.

మొత్తం రాబడి, పెట్టుబడి ఖర్చుకు రెట్టింపు ఉంటుంది.

ఇలాంటివి ఇరవై జట్లు అయినా, ప్రతియేడూ వేటకు వెళ్తుంటాయి.

అన్నింటికంటే ఎక్కువగా యీ వేటకు దిగేది నార్వే. ప్రతి యేడూ 8 జట్లను పంపుతుంది. దక్షిణాఫ్రికా 1, బ్రిటన్ 3, జట్లను పంపుతాయి. రష్యా జపాన్, హాలెండ్ కూడా కొన్ని జట్లను పంపుతూ ఉంటాయి. ఈ తీరసముద్రాలలో వ్యాపారానికి ఉపకరించే తిమింగలాలు, సమూలం, నాశనమైపోయాయి. వేటకు ఇక మిగలకుండా వేటాడేశారు. ఇప్పుడు దక్షిణధృవ తీరానికివెళుతున్నారు.

## ఇక మిగలవా ఏమిటి!

దక్షిణ సముద్రాల్లో కూడా తిమింగలాలు ఇక మిగలవని వివిధ దేశాల ప్రభుత్వాలు భయపడ్డాయి. ఒక అంతరాతీయ తిమింగల వేట సంస్థ ఏర్పడింది, లండనులో కార్యాలయంతో. వీరు పెట్టిన నియమాల ప్రకారం పిల్ల తిమింగలాలను చంపరాదు, కొన్ని నిర్ణీత బృందాలు మాత్రమే వేటకు వెళ్ళవచ్చు. ఏప్రిల్ 7 నుంచి జనవరి 7 వరకు మాత్రమే వేటాడాలి. అన్ని బృందాలూ కలసి 14500 కంటే ఎక్కువ నీలి తిమింగలాలను చంపరాదు. (ఒక్కొక్క నీలి తిమింగలం బదులు రెండు పొలుసుల తిమింగలాల్ని గానీ, 25 మూపురం తిమింగలాలను గానీ, ఆరు 'సీ' జాతి తిమింగలాల్ని కానీ సొమ్ము చేసుకోవచ్చు) ఎవరికైనా తిమింగిలాలు దొరికినా దొరక్కపోయినా, 14500 నీలి తిమింగలాలకు మించి చంపరాదు.

అయితే ఈ వేట జట్లన్నీ ఈనియమాలను సరిగా పాటిస్తున్నారా లేదో ఎలా తెలియాలి!

జంతుశాస్త్రవేత్తలు ఈ సంఖ్యను 14500 నుంచి తగ్గించాలంటున్నారు. తిమింగలాల 'జనభా' పడిపోతోంది.

## పాశ్చాత్యులు ఇంకా తింటంలేదు

తిమింగలాల మాంసాన్ని పాశ్చాత్యులు ఇంకా తింటంలేదు-ప్రస్తుతం అది ఎరువుల్లోకి పనికొస్తోంది. తిమింగలం గ్రంథులను మందుల్లో-చాలా విలువైన మందుల్లో వాడుకోవచ్చు. తిమింగలాలు తమ గ్రంథులను మానవునికి ఇచ్చేసి, వారికంలాగా, మళ్ళీ పెంచుకుంటూ ఉండరాదూ! తీరా ఈ వేటగాళ్ళు, వేటకళ్ళి ఈగ్రంథులను పట్టుకురావడం అరుదు!

1953-54 లో 34872 తిమింగలాలను చంపారు! వీటి మూలంగా 2285720 పీపాల నూనె లభించింది. ఇక మిగిలిన పదార్థాలు, 'పెదవిపూత' తోపాటు, ఎంతెంతగా లభించాయో ఊహించవచ్చు.

('కామన్వెల్తు టుడే' నుంచి)



తిమింగిలాల దేహాలను ఓడకు కట్టివేశారు-అవి కొట్టుకుపోకుండా-ఒక్కొక్కదాన్నీ పైకిలాగి ఈకకు ఈకా తోకకు తోకా విడతీసి సొమ్ము చేసుకుంటారు.

పోక్ కర్రలాంటి కర్రతో తిమింగలం దేహాన్ని కోస్తున్నారు. ఇది చాలా నైపుణ్యంతో చేయవలసిన పని-ఈ పొరలో చాలా నూనె లభిస్తుంది.

# ఇన్‌ఫ్లూయెన్స్-ఇన్‌ఫ్లూయెంజా ప్రస్తుతం 'ఆసియా' శీతజ్వరం

ఫ్లారెన్సునగరంలో అనేకులు దగ్గడం, ఎగబీల్చడం, జ్వరపడడం ప్రారంభించారు. 'ఇదమిట్టి' అని జ్యోతిష్యుల్ని అడుగుతే, ఒక విపరీత గ్రహస్థితి ప్రభావం (ఇన్‌ఫ్లూయెన్స్) మూలాన ఇలా జరుగుతోందన్నారు. ఆనాటినుంచీ ఈ 'ఇన్‌ఫ్లూయెన్స్'ను 'ఇన్‌ఫ్లూయెంజా' అన్నారు.

—ఫ్లారెన్‌టైన్‌వంశ కవితలనుంచి (1200-1470)

తూర్పుఆసియాలో ఒక కొత్త "ఇన్‌ఫ్లూయెన్స్" తారసిల్లింది. తక్షణం దాన్ని మట్టుపెట్టడానికి యుద్ధం చేయాలనీ సరంజామా కావాలని ప్రపంచ మంతటా ఒక ఆందోళన ప్రారంభమయింది. ఈ యుద్ధాన్ని నడపడానికి జెనీవాలో ఉన్న ప్రపంచ ఆరోగ్యసంస్థ కేంద్ర కార్యాలయం నడుం కట్టుకుంది. 'ఇన్‌ఫ్లూయెన్స్' శిర్సు ఎక్కడ తలెత్తుతే అక్కడ నుంచి దాని ప్రభావకణాలను కేంద్ర కార్యాలయానికి పంపమన్నది. 46 దేశాలు పంపుతున్నాయి. ప్రపంచంలో ఒక డజను శాస్త్రపరిశోధనాలయాల్లో ఈ 'ఇన్‌ఫ్లూయెన్స్' దాడి తిన్న రసిని శాస్త్రవేత్తలు పరీక్షిస్తున్నారు. దీన్ని అంతం చేయడానికి ఏ కొత్త ఆయుధం దొరుకుతుందా అని ఆలోచిస్తున్నారు. ఈ "ఇన్‌ఫ్లూయెన్స్" ఎక్కడెక్కడ ఎప్పుడెప్పుడు దెబ్బతీస్తుందీ, దాని బలాబలాలు ఏమిటి, రక్షణకు ఏ చిట్కా దొరుకుతుందీ, అని అహర్నిశలూ ఆలోచిస్తున్నారు.

ఇలా ఎదురు దెబ్బతీయడానికి సుసంఘటితమైన సంరంభం ఈనాడే ప్రారంభమైంది-సాధ్యమైంది-ప్రపంచ వ్యాప్తంగా చేయదగు కృషి అని విశ్వసించడంకూడా జరిగింది.

## నేటిమిత్రుడు!

శతాబ్దాల తరబడి గొప్ప గొప్ప జాడ్యాలు మానవులను పీడించుకు తింటున్నాయి. 'ఇన్‌ఫ్లూయెన్స్' అంత గొప్ప జాడ్యం కాదని దాన్ని ఎవ్వరూ ఖాతరుచెయ్యలేదు. గొప్ప గొప్ప జాడ్యాలు పెద్దలనూ, నిస్సత్తువ మనుష్యులనూ పాటినబెటుకునేవి. అందుకనే వాటికి "నూత్నమిత్రుడు", "మృదుసంస్కారం", "సరదావన" అని ముద్దుపేర్లు పెట్టారు. కానీ ఆ మహా జాడ్యాలను అణిచేస్తుంటే ఈ 'ఇన్‌ఫ్లూయెంజా' పడగ విప్పసాగింది. చివరకు ఎంతగా తలెత్తిందంటే, 1918-19 లో భూగోళమంతటా పాక్కి, 150 లక్షల మందిని తినేసింది-అందులో అనేకులు మంచి యౌవనంలో ఉన్నవారే. అయినాసరే, ఈ జాడ్యపుపుటక రహస్యాన్ని ఎవ్వరూ కనుక్కోలేదు.

తీరా 1933 లో ఒక రసి,-రసి, 'ఎ'-ఈ వ్యాధిని కల్గిస్తున్నదని, వైద్యశాస్త్ర ధర్మాసనంలో తేల్చారు. ఈ "రసి-ఎ" ప్రతి రెండుమూడేళ్లకూ విజృంభించి యుద్ధానికి దిగుతుందనీ, నాలుగు లేక ఏడుఏళ్ళ కొకసారి పెద్ద పెద్ద యుద్ధరంగాలను కూడా సృష్టించేస్తుందనీ వీరు తమ ఆరోపణలో పేర్కొన్నారు. ఒక టీకాను కనుగొన్నారు-దాన్ని 'టీకా-ఎ' అందాం. అది ఈ "రసి-ఎ" చర్యలను సమ్మచేయగలదన్నారు. ఈ 'టీకా-ఎ' రెండేళ్ళ పాటు పటుత్వం కలిగివుండి, రక్షణకు ఆ రెండేళ్లూ తోడ్పడుతుందన్నారు.

తీరా 1940 లో "రసి-బి" అనే మరో 'ఇన్‌ఫ్లూయెన్స్' యుద్ధనేరస్తుని కనుగొన్నారు. "టీకా-ఎ", ఈ "రసి-బి" చర్యలను అరికట్టలేదు. ఆపైన "రసి-సి-" అని మరొకటి బైటపడింది. "టీకా-ఎ" రెండేళ్లలో తనసైజాన్ని మార్చుకుంటుంది. రెండేళ్ళలో అదే వస్త్రం పోతుంది — ఇక జాడ్యాన్ని ఏమి చెయ్యగలదు? 1950 లో పుచ్చుకున్న "టీకా-ఎ", 1957 లో తగిలిన "ఇన్‌ఫ్లూయెంజా"ను ఎదుర్కొనలేదు. అప్పటికి అది ఉపకరించనంత పరివర్తనం చెంది ఉంటుంది. అదీస్థితి.

## అడిమెట్టిన క్షేత్రాలు

ఇక ఇప్పటి "ఇన్‌ఫ్లూయెన్స్" ఎట్లా సాగిందంటే—జనవరిలో ఉత్తర చైనాలో మొదలైనట్లు వినికిడి. ఫిబ్రవరిలో షాంగైకి చేరింది. మార్చినాటికి కాంటన్ చేరుకుంది. ఏప్రిల్ నాటికల్లా హాంకాంగ్‌లో ప్రవేశించింది. చైనా నుంచి వచ్చే శరణార్థులు యీ అంటు వ్యాధిని హాంకాంగ్‌కు మోసుకునివచ్చారంటున్నారు.

'ఇన్‌ఫ్లూయెన్స్' మూడు నాలుగు రోజులుంటుంది. దానితో బాగా తలనొప్పి, జ్వరం (నూటనాలుగు డిగ్రీల దాకాకూడా), ఒళ్ళునెప్పులు, నిస్త్రాణ ఉంటాయి. మరీ చిక్కులుగా బ్రాంకైటీస్, న్యుమోనియా, వచ్చిపడ్తాయి. అందుకోసం 'సల్ఫా'మందులు, 'యాంటీ బయొటిక్స్' వాడుతారు. హాంకాంగ్‌లో మందుల దుకాణాల ముందు ఈ మందులకోసం వరసల్లో జనం నిలబడేవారు—నిరుద్యోగులు ఈ వరసల్లో ఇంకొకరికోసం నిలబడి, వరుమానం వసూలుచేసుకున్నారు. కొందరు నిలబడ్డప్పుడల్లా ఒకడాలరు సంపాదించారు. ఒక్కనెలలో హాంకాంగ్‌లో 5 లక్షలమందికి వ్యాధిపోకింది—44 మంది పోయారు.

ఈలోగా సముద్ర మార్గాలద్వారా, వాయుమార్గాలద్వారా, అంగట్లో పెట్టుకొని మోసుకెళ్ళారు ఈవ్యాధిని ఆ దేశులు, వివిధ దేశాలకు.

అది వెళ్ళి తిష్ఠవేసిన దేశాల్లోస్థితి ఇలా ఉంది:

ఫార్మోజా: ఏప్రిల్ దాకా 20 లక్షల మందికి సోకింది—పాపం! విదేశాంగ మంత్రికీ, ఆర్థికవ్యవహారాల మంత్రికీ కూడా తగిలింది—మొత్తం 66 మంది చనిపోయారు.

ఫిలిప్పైన్స్: మే మొదటి రోజుల నాటికి 16 లక్షలమందికి (అధ్యక్షుడు కార్లోస్ గేసియాకుకూడా సోకింది) తగిలి, 1200 మంది పోయారు. అమెరికా సైనికులలో చాలా తక్కువగా వ్యాపించింది.

సింగపూరు, మలయా: ఏడులక్షల మందికి తగిలి, 10 మంది పోయారు.

ఇండోనీషియా: జావాభాలో నాటికి పదినుంచి 20 మందిదాకా పడ్డారు. తెలిసినంతవరకూ 48 మంది పోయారు.

జపాన్: పదిహేను లక్షల మందికి అంటి, ఐదుగురు చనిపోయారు. అమెరికా నావికా సైనికులు హోటళ్లలో పానశాలల్లో పనిచేసే దాసీలద్వారా ఈ వ్యాధిని వ్యాప్తిచేశారని ప్రబల విశ్వాసం. 1550 మంది బడిపిల్లలు రాక 295 పాఠశాలలు మూతపడిపోయాయి. పిల్లలచేత ఉప్పునీటినీ, ఆకుపచ్చ తేనీటనీ పుక్కిలింపజేశారు.

భారతదేశం: 1280 వేలమందికి సోకి 108 మంది పోయినట్లు అధికార్ల లెక్క. చాలా తక్కువగా వేసి ఉంటారు. 'రాజూలా' అనే నౌక ద్వారా ఈ వ్యాధి మద్రాసుకు మే 16 నాడు రవాణాఅయిందని అధికారుల వివరణ. ఢిల్లీలో ప్రభుత్వ కార్యాలయాల్లో నాటికి 80 మంది గైర్ హాజరయ్యారు, జ్వరంమూలంగా. ఈత కొలనులను, సినిమాలను, ఢిల్లీలో మూసేశారు. శరీరంపైనా ఆత్మపైనా అదుపుఉంచే సాధువులు యజ్ఞంచేస్తుండగా వారికి వ్యాధిసోకింది.

పాకిస్తాన్: భారతదేశంలోకంటే తక్కువ మోతాదులో వ్యాప్తిఅయింది. ఇక్కడనుంచి వచ్చి మనీయాకు ప్రయాణంచేస్తున్నట్లున్నది.

## కొత్తటీకా

హాంకాంగ్‌లో అదివరకు 'టీకా-ఎ' వాడారు. కానీ దాని పటుత్వం ఈనాటికి నమసిపోయింది. దాని సైజం రెండేళ్ళలో పరివర్తనం చెందుతుంది కదా. హాంకాంగ్, సింగపూరు జపాన్‌లలో గొంతులు కడిగిన నీటిని భద్రపరిచి, జెనీవాకు పంపారు. అక్కడినుంచి వివిధ పరిశోధనాలయాలకు పంపారు. అక్కడ సగం పొదిగిన కోడిగుడ్లలోకి ఈ నీటిని ఎక్కిస్తే రెండురోజుల్లో వ్యాధిరసి కొన్నిలక్షల రెట్లు వృద్ధి అయింది. అలా పెరిగిపోయిన వ్యాధికణ సంయుత పదార్థాన్ని వేరే గుడ్లలోకి ఎక్కించినా, అలాగే రసి వృద్ధిఅయింది. మానవ రక్తంపైనా పసురక్తంపైనా ఈ రసి ప్రభావాన్ని పరిశోధించారు, అది వివిధమైన 'రసి' అయిఉంటుందో తెలుసుకోవాలని. అది, రసి-ఎ రకందే అని తేలింది. కానీ ఈ తడవ కనపడ్డ 'రసి-ఎ' ఒక కొత్తపద్ధతిలో పరివర్తనం చెందేది. ఈ రసిని, పూర్వం తయారుచేయని ఒకవిధమైన విరుగుడుద్వారా సమ్మచేయవచ్చునని తేలింది. కొత్త టీకాను తయారుచేయాలి.

ఈ మధ్య మనిలా నుంచి కాలిఫోర్నియా తీరానికి ఒక ఓడవచ్చింది. అందులో 10 మంది 'ఇన్‌ఫ్లూయెంజా' తగిలినవారు. వాళ్ళని ఇళ్లకుపోనిచ్చి, స్థానిక ఆరోగ్యశాఖాధికారులకు ప్రభుత్వం హెచ్చరికచేసింది. మరోక ఓడ ముగురురోగులతో వచ్చింది-అసలు ఆ ఓడలో 96 మందికి సోకిందట-మొత్తం 20 రోజులు ప్రయాణంచేసి వచ్చారు - ఓడ మనిలా-హాంకాంగ్-యొకొహామా - శాన్‌డియాగోమీదుగా వచ్చింది. మొత్తంమీద, ఓడలో ఒక స్త్రీ మరణించింది. అమెరికాలో టీకా తయారుచేస్తున్నారు. ఆగస్టు నాటికి కావలసినంత లభిస్తుంది. అప్పటికి ఇలాటి వ్యాధులువచ్చే ఋతువు సమీపిస్తుంది.

యూరప్‌లో మొట్టమొదటగా నాటర్‌డాంలో పొక్కిందీ వ్యాధి. మిలాన్‌లో ఒక ఫుట్‌బాల్ బృందం మొత్తం మొత్తం శీతజ్వరం పాలయింది. రోంలో ఒక్కరికి అంటగా, ఉళ్ళోఉన్న 18 లక్షలమందీ భయపడ్డారు. చాలా మంది రోమన్ పెద్దలు నాలుగోడలూ దాటి బయటకు రాకూడదని నిశ్చయించుకున్నారు! జాగ్రత్తగా ఉండవలసిన వ్యక్తుల్లో 'పోప్' ఒకరు; ఆయన చేతులకు అల్కహాల్ రాపడంపెట్టుకుంటూ, పవిత్ర శిలువను రోజుకు నాలుగైదుసార్లు ముద్దుపెట్టుకుంటూ కాలంగడుపుతున్నారు, ఏ యాత్రికుడూ ఆసియా ఇన్‌ఫ్లూయెంజాను తనకు అంటించకుండా.

ఈ 'ఆసియా ఇన్‌ఫ్లూయెంజా' ను నిరోధించడానికి ప్రస్తుతం మందులేదు. కొత్త టీకా పుట్టుకొస్తేతప్ప. నొప్పులు వగైరా తగ్గడానికి యాస్పిరిన్, కోడీన్ తప్ప వేరే చేసేదిలేదు-ఉష్ణం తగ్గడానికి ఆల్కహాల్ పట్టీలు, మంచుకొత్త పెంతప్ప గత్యంతరంలేదు. యాంటీ బయొటిక్స్, ఇతర వింతమందులు ఈ రసి అంటుడు జబ్బులపైన పనిచేయవు-ఊపిరితిత్తులపై దాడిచేసే క్రిముల ధ్వంసానికే అమందులు పనికొస్తాయి. యాంటిబయొటిక్స్‌ను అవసరమైన రోజుదాకా దాచి ఉంచాల్సిందే.

('టైం' నుంచి)

# నాటకాలు-నా అనుభవాలు

శ్రీ నిడుదవోలు సూర్యనారాయణ

ఏ వృత్తిలోనైనా మానవుడు పుత్తీర్ణుడు కావాలంటే అంగసౌష్ఠవాది గుణములుకల్గి విశేషపరిశ్రమ చెయ్యాలి. ప్రారంభదశలో ఏవిషయమైనా కృషి చేసేటప్పుడు "విద్య" అవుతుంది. విద్-టు-నో-విద్య. తెలుసుకోవలసిన విషయము. ఇది కార్యరూపేణా ఆచరణలో పెట్టిననాడు 'కళ' అవుతుంది. ఇది ఆత్మప్రతిబింబము. తేజస్సుతో నిండిన ఛాయ. సంకల్పం పుట్టగానే హృదయమునుంచి పూర్వముఖంగా వెళ్లి రూపము ఏర్పడి నామము కలిగి కార్యరూపేణా అధోముఖంగా ఆచరణలోకి వస్తుంది. రూపం మనస్సు చిత్రించినప్పుడే బాగోగులు చూచుకోవాలి. అనేకరూపాలు హృదయంలో ప్రవేశిస్తాయి. ఏరూపంగా వుంటే బాగుంటుందో మనస్సులో భావనలో తర్జన భర్జన చేసుకోవాలి. అందులో సాంఘిక పాత్రను సహజంగా సృష్టించుకోవాలంటే చాలాకష్టం. సాంఘిక జీవనం దేశకాలపరిస్థితులనుబట్టి మారుతూవుంటుంది. సందర్భమునుబట్టి అప్పటి పరిస్థితికి అనుగుణంగా నటించాలి. రాత్రి పడుకున్నప్పుడు పైమోస్తరుగా ఆలోచించుకొనేవాణ్ని. రంగస్థలంలో ఆ పాత్రతోవుండి ప్రేక్షకులను గమనిస్తూ ప్రక్క నటులతో మాట్లాడుతున్నట్లు భావించుకొనేవాడిని. ఈ భావన ఆధ్యాత్మిక విద్యా విధానం ఆచరిస్తున్నవానికి బాగా అలవాటులో వుంటుంది. నిత్యం పరమేశ్వర ధ్యానంలో ఇష్టదైవాన్ని మూర్తివంతంగా ధ్యానిస్తూ ఉంటాడు కాబట్టి ఆ భావించేస్థలంలో ఏ మూర్తినైనా నిలబెట్టి తగినట్టు చిత్రించుకోవాలి. చిత్రించుకోవచ్చు. దీనికి బ్రహ్మచర్యం ముఖ్యం. నటకుడు ఆరోగ్య సూత్రాలు ముఖ్యంగా పాటించి ఆచరించాలి. బ్రహ్మచర్యం సలుపుతూ కళాసేవచేస్తే అంతంలేని విలువ కలుగుతుంది. నేను సహజంగా ఆధ్యాత్మికపిపాసిని. సాధారణంగా రంగస్థలంమీదికివస్తే నా నేత్రముల నుంచి (సినిమా ఆపరేటరు, రూము నుంచి కన్నముల ద్వారా తెరపైకి కాంతికిరణములు ప్రసరించినట్లు) తేజస్సువచ్చి ప్రేక్షకులను ఒక పెద్ద దుప్పటివారిపై కప్పినట్లుండి నా ఎదుట నా పాడుగునా బింబాకారంలో కవచంగా వుండేది. అప్పుడు నాకు చాలా అహ్లాదంగా వుండేది. ఏమాటచెప్పినా, భావప్రకటన చేసినా, ప్రేక్షకులు హర్షించేవారు. దీన్నిబట్టే "వేషం కళకట్టింది" నాటకం కళకట్టింది." అని ప్రేక్షకులు అంటారు. ఇది ఆత్మ మూడవధాయ తిక్కన రెండుఛాయలు సంకల్ప రూపములు. దీనినే నాదము-బిందువు, కళ, అంటారు. వాయుబంధన కూడా కళాసేవకు ముఖ్యము. దాని వలన వాయుశక్తి షట్చక్రాది యమములలో ప్రవేశించి చైతన్యము కల్గించును.

ఒకనాడు రాణి రుద్రమ్మనాటకంలో ప్రతాపరుద్ర మహారాజు పాత్రలో ఒకకాలమున రౌద్రము హెచ్చుగా చూపించవలసిన సమయం పద్యరూపంగా వుంది. 4-స్థుతినుంచి మొదటిపద్యం చదివి - రెండవపద్యం యింకా హెచ్చుస్థాయిలో చదివితేగాని రౌద్రరసం పోషింపబడదు. ఒకప్పుడు పూసిరి ఉండదు. అందుకే పట్టుట-విడుచుట తెలిస్తే పూసిరి సరుకొని, అప్పటికి తగిన భావప్రకటన చేసి-మళ్ళీ హెచ్చుస్థాయికి వెళ్ళి పద్యం చదివేవాణ్ని. దీంతో పద్యం తరువాత పద్యం హెచ్చుస్థాయిలో ఆయాసం లేకుండా చదవడం అలవాటైంది. కేవలం రాగంమీద ఆధారపడేవాణ్ని కాదు. భావప్రకటన కూడా చేస్తూవుండేవాణ్ని.

పాత్రలు చిత్రించుకోవడంలో చాలా పరిశ్రమ చేసేవాణ్ని. కీ. శే. పానుగంటి విజయరాఘవరావుగారి "లోభి" అనే సాంఘిక నాటకంలో లోభి పాత్ర వెయ్యవలసి వచ్చింది. 70 ఏళ్ల వయస్సు - నాటకం 15 రోజులు వుంది అనగా మదరాసు ఆంధ్రవిజ్ఞాన సమితివారు, నేను దానిలో సభ్యునిగా వుండుటచేత, పేరుగన్న నటకులు ఎవరూ ధరించుటకు ఒప్పుకోకపోవడము చేత, అప్పటిలో ఒకపాత్ర అనగా ధమిడిపాటి కామేశ్వరరావుగారి "ఎప్పుడూ ఇంతేనా" హాసకోలు పాత్ర ధరించి ప్రేక్షకుల మెప్పు పొందుటచేత నాకు ఆ పాత్ర ఇచ్చేరు. నాటకం 15 రోజులు వుంది. అప్పటికి నేను అటువంటి ముఖ్యపాత్ర-సమస్యలతో నిండివది అడుగడుగునా భావ భూయిష్ఠమైనదీ-ధరించలేదు. మదరాసు నగరంలో వెయ్యడం. పాత్రనుబట్టి భాషా? భాషనుబట్టి పాత్రా? కవులు భావనాసృష్టిలో రచన సాగడమే ప్రాధాన్యంగా చూస్తారు కాబోలు! పాత్ర ఎలాగా వుండాలి? 70 ఏళ్లవాడు-గొంతుక వణికించాలా? చిన్న పాత్రఅయితే బాధలేదు. పది నిముషాలపాటు, అప్పుడప్పుడు రంగస్థలంమీదికి వచ్చి గొంతుక వణికించవచ్చు అనుకుందామంటే ముఖ్యపాత్ర వణుకు అలవాటు అవుతుందేమో అని భయం. ఈవిధంగా తర్జనభర్జన అవుతూ నాలుగురోజులైంది. ఏదో విధంగా వేషం వెయ్యాలి. "సింగరాజు లింగరాజు" వరవిక్రయం ఘోర జీలో పోనీ అని కొందరు ఒత్తిడి చేసేరు. సంఘం పేరుతో కళను పాడు చెయ్యడం ఇష్టంలేదు. ఇచ్చిన పాత్రను వదలుకోలేను. ఆత్మ నీకు నటనాశక్తి వుందని ప్రబోధిస్తోంది. ఒక రోజల్లా దైవప్రార్థన చేసేను. 3 సార్లు పుస్తకం చదివేను. చర్చలు జరిపేను. సినిమా వారు సినిమాలాగ చెప్పేరు. తిరిగి చదువుతూన్నప్పుడు "నేనే వున్నాను డబ్బుయివికళ్ళవాణ్ని సునపంలాగ" అన్న మాటతో, వణుకు సంశయం, వ్యక్తి శరీర స్థితి నిర్ధారణ అయింది. అయితే వైశ్యులు లోభులని వాడుకలోవున్నా, వారి స్వసౌఖ్యం-శరీర భూషణాలకి డబ్బు వెచ్చిస్తారు. తీర్థయాత్రలు సేవిస్తారు. అప్పుడప్పుడు దానం చేస్తారు. లోభి కేవలం పైవాటికి వ్యతిరేకం.

పురికిక వచ్చడిగో నూరేసుగులబలం వస్తున్నప్పుడు, మంచి నీళ్ళలో రోగాలు పోతున్నప్పుడు, రెండంగ వస్త్రములలో తనువు వెళ్తున్నప్పుడు, అన్న మాటలనుబట్టి ఒక బ్రాహ్మణజాతిలోతప్ప యిటువంటి వ్యక్తి వుండదని స్థిరపడి పాత్ర పోషించుకుంటూ వచ్చేను.

గడ్డము 20 రోజులనుంచి పెంచుట కావిరంగు వచ్చువరకు రెండంగ వస్త్రాలను రోజూ వుతికి ఆరేసేవాణ్ని. చెట్టు క్రింద దాచిన డబ్బు పోతుంది? దాని ఫలితంగా శోకలు వేస్తాడు నవరసాలతో. ఆ భావములను అక్కడక్కడ యిమిడ్చి, ఆధ్యాత్మిక ముద్రలతో ఏకపాత్రా అభినయములతో ప్రేక్షకులను పురూరాత లాగించినది ఆ పాత్ర.

శ్రీ శ్రీ శ్రీ పిఠాపురం మహారాజా వారు, గిడుగు సీతాపతిగారు, దేవులపల్లి వెంకటకృష్ణశాస్త్రిగారు, నిడుదవోలు వేంకటరావుగారు, ఆర్. బి. రామకృష్ణ రాజుగారు మొదలగు ప్రముఖులు విచ్చేసి తిలకించేరు. వారి ప్రశంసకు పాత్రుణ్ణి అయినాను. కీ|| శే|| పానుగంటి లక్ష్మీనరసింహారావుగారి "కంఠాభరణం" అనే నాటకంలో సోమావధానులు పాత్రకు తగిన పరిశ్రమ చేయవలసి వచ్చింది. పిఠాపురం మహారాజావారు స్వయముగా వ్రాయించిన హాస్యరసభరితమైన నాటకం. కుటుంబంతో సహా వచ్చి నాటకము అంతంవరకూ వుండి అభినందించేరు.

చారిత్రక నాటకములలో అల్లావుద్దీన్, మంత్రిభాస్కరుడు, ప్రతాపరుద్రమహారాజు, మదాసీదు.

పౌరాణికంలో భీముడు, కర్ణుడు, దుర్యోధనుడు.

సాంఘికంలో లోభి, కంఠాభరణం, మేనరికం మొదలుగాగల నాటకాల్లో ముఖ్యపాత్రలు ధరిస్తూ ఉండేవాణ్ణి. నాటికలు చాలావరకు ప్రదర్శిస్తూవుండే వారు. ఇది అంతయూ మద్రాసు నగరంలో వున్న ఆంధ్ర విజ్ఞానసమితి అధ్వర్యాన జరిగినవే. ప్రతీపాత్ర ధారణంలోను ప్రజల అభిమానమును పొందుతూ ఉండేవాణ్ని.

నటుడునకు స్ఫురద్రూపము, మధురమైన గాత్రము, సమయస్ఫూర్తి, మేధాశక్తి, జ్ఞాపకశక్తి, కళయందు పరిపూర్ణ ఆసక్తి, బ్రహ్మచర్యము మొదలగునవి కావాలి. రంగస్థలములో పూర్తిగా ప్రేక్షకుల వైపుగాని, తోడి నటకుల వైపుగాని వుండక సగముగా వుండి అనగా ప్రక్కనటునితోను, ప్రేక్షకులు వినేటట్లు పద్యముగాని, పాటగాని, వచనముగాని స్పష్టముగా వుచ్చారణ చెయ్యవలెను. పాత్రపోషణ ఎంతబాగున్నప్పటికీ ఉచ్చారణ స్ఫుటంగా లేనిదే ప్రేక్షకుల మన్ననలకు పాత్రుడుకాలేడు.

పాత్రోచిత భాష ఉంటే బాగుంటుంది. చారిత్రకపాత్రలు కల్పింపబడినవికావు కాబట్టి అట్టి పరిమాణములో నె వ్యక్తులుపాత్రలు ధరిస్తే బాగుంటుంది.

# చైనాకు వెంటనే సమితిలో సభ్యత్వం

## కామన్వెల్తు ప్రధానులకు నెహ్రూ స్పష్టీకరణ

లండన్, జూన్ 28: సమితి శ్రేయస్సు దృష్ట్యా సమితిలో చైనాకు కాలహరణంలేకుండ సభ్యత్వం ఈయాలని కామన్వెల్తు ప్రధానుల సమావేశంలో భారత ప్రధాని శ్రీ నెహ్రూ స్పష్టంచేశారు. ఈ విషయమై ప్రధానుల మధ్య భేదాభిప్రాయాలున్నాయి. కొంతమంది చైనాకు సభ్యత్వం ఇచ్చేందుకు వ్యతిరేకంగా ఉన్నారు. మరికొంతమంది సభ్యత్వం ఉండాలనే విషయాన్ని సూత్రప్రాయంగా అంగీకరిస్తూ, అందుకు ఇది తగిన సమయం కాదన్నారు.

సమితిలోను, సమితి సంఘాలలోను చైనాకు సభ్యత్వం ఉండాలనే సూత్రాన్ని బ్రిటన్, పాకిస్తాన్లు అంగీకరించాయి కాని చైనాపట్ల అమెరికా విధానం మారేవరకూ చైనాకు సమితిలో సభ్యత్వం ఉండరాదని ఈ దేశాల ప్రతినిధులు తెలిపినట్టు తెలిసింది. ఇక్కడ ... నెహ్రూ హెచ్చరించారు.

దక్షిణ కొరియాలోని సైన్యాలకు నవీన ఆయుధాలను సరఫరాచేయాలన్న అమెరికా విధానంపట్ల శ్రీ నెహ్రూ అసంతృప్తిని తెలియజేశారని కూడా తెలిసింది. ఇందువల్ల ఆ ప్రాంతంలో మరింత ప్రమాదాలు కలిగే అవకాశం ...

# యూరప్‌లో అమెరికా సేనల ఉనికి

## అవసరమని ఫ్రెంచి విదేశ మంత్రి భావం

టులూస్, జూన్ 28: యూరప్‌లో అమెరికన్ సేనలుండి తీరాలని, అణ్వస్త్రాలతో విముక్తి సాధించే వుద్దేశం ఫ్రాన్సుకు లేదని ఫ్రెంచి విదేశాంగ మంత్రి క్రిస్టియన్ పినో లండన్ ఆయుధ విసర్జన చర్చలపై ఫ్రెంచి సోషలిస్టు పార్టీ కాంగ్రెసులో నిన్న చెప్పారు. ఉద్రిక్తతలసడలింపుకు ప్రారంభ ప్రయత్నాలు జరగాల్సి వున్నా, దురాక్రమణ దారులను ఆహ్వానించే పరిస్థితి మాత్రం కల్పించరాదన్నారు.

ఆల్జీరియా విప్లవకారులకు మొరాకో, ట్యునీషియాలు సహాయపడటం ఫ్రాన్స సహించదని, ఆల్జీరియా సంగతి తేలేవరకు ఫ్రాన్స్-మొరాకో, ఫ్రాన్స్-ట్యునీషియా సమస్యలు పరిష్కారం కావాలవని వివరించారు.

ఆల్జీరియా విధానాన్ని సమర్థించాలని ఆల్జీరియామంత్రి రాబర్ట్ లాకోస్టే సోషలిస్టులకు విజ్ఞప్తి చేశారు.

# దక్షిణ కొరియాకు కొత్త ఆయుధాలు

## సమితి సైన్యం చర్య!

### చైనా ఖండన

# కొరియాపై అంతర్జాతీయ సమావేశం

# భారతీయులపై లాఠీ ప్రయోగం

## ద. ఆఫ్రికా పోలీసుచర్యకు కాంగ్రెసు నిరసన

# కామన్వెల్తులో మలయాకు సభ్యత్వం

# సైనిక కూటాలకు భారతదేశ విముఖత

# సూడాన్ పార్లమెంటు రద్దు

# ఆర్థిక సమస్యలపై వచ్చేవారంలో చర్చ

# అల్జీరియా జాతీయోద్యమ ప్రతినిధితో నెహ్రూ చర్చ

# పశ్చిమాసియాపై నెహ్రూ ప్రకటనకు హర్షం

# ప్రస్తుతం చైనాను అమెరికా గుర్తించదట

# ఆర్థిక సమస్యలపై కృష్ణమాచారి చర్చలు

# "ప్యాసా"

# ఆకాశవాణి

సోమవారం, జులై 1

# ప్రకటన

# కావలెను

# టెండరు నోటీసు

# సినిమా

## మద్రాసులో సినిమాలు

| | | |
|---|---|---|
| గెయిటీ, భారత్, మహాలక్ష్మి | తంగమలై రహస్యం (తమిళం) | |
| ప్రభాత్, చిత్ర, సరస్వతి, కామధేను | కోడప్పుక్కరసి | ,, |
| కాసినో, శ్రీకృష్ణ | మాయాబజార్ | ,, |
| బ్రాడ్వే, లక్ష్మి | వణంగాముడి | ,, |
| ఈరాస్ | మాదరగ్ కుల మాణిక్కం | |
| రాజకుమారి | అల్లావుద్దీన్ అద్భుత దీపం | ,, |
| కపాలి | తాయ్కు పిన్ తారం | ,, |
| సన్ | మనమగన్ తేవై | ,, |
| వెలింగ్టన్ | మధురైవీరన్ | ,, |
| ప్లాజా | ప్యాసా (హిందీ) | |
| స్టార్ | మిస్టర్ ఎక్స్ | ,, |
| అశోక్ | అల్ బేలీ | ,, |
| పయొని | సి. ఐ. డి. | ,, |
| శ్రీ పద్మనాభ-ఖోల్ జా సిం సిం | | ,, |
| సెలక్ట్ | టూ ఆంఖే బారా హాథ్ | ,, |
| ఓడియన్ | Hollywood Or Bust | |
| మిడ్‌లాండ్ | The Ambassador's Daughter | |
| న్యూగ్లోబ్ | Children Of Love | |
| న్యూ ఎల్ఫిన్‌స్టన్ | Lost | |
| మినర్వా | High Society | |

## శీతజ్వరం

శీతజ్వరం రాకుండా, కాపాడుకొనుటకు మంచి మందు ఖరీదు రూ. 1.85న.పై. మనియార్డరు పంపిన మందు పంపబడును. వి.పి. లు పంపబడవు. కవిరాజ్ టి. యన్. రావు, చిలుకూరు పోష్టు, ...

శినిమా - మదరాసు-17.








Printed and Published for Nageswara Rao Estates (private) Ltd. by S. Radha Krishna, at the Andhra Patrika Press, 6 & 7 Thambu Chetty St., Madras-1. Editor S. Sambhu Prasad.